శ్రీ




# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౭. { సర్వధారి. ఆశ్వయుజ-ఫాల్గుణములు } సంచిక ౪-౬.





కాకినాడ

పరిషత్కార్యాలయమునం బ్రకటింపబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1948–49.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)



కాకినాడ

సర్వధారి సంవత్సరము

సంపుటము ౩౭

1948—49

# సర్వధారి సంవత్సరము.

# 1948—49

## విషయ సూచిక.

---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౨. | సర్వధారి. ఆశ్వయుజ-ఫాల్గుణములు | సంచిక ౪-౫.

## సౌదామిని

త్రిలిఙ్గపత్రికలో (సం. 32–3 సంచిక) సౌదామని, సౌదామిని పదములనుగూర్చిన విమర్శనమునందు సౌదామనియే సంస్కృతశబ్దమనియు, 'అది తత్సమమై తెలుఁగుభాషఁగానే సౌదామినియని ఏకవ్యవహారములో కుదురుకొనినది. పదముచివరగల ఇకారసాహచర్యముచే దానియందలి అధ్వనికూడ ఇకారముగ మారినదని' వ్రాయబడినది. సుప్రసిద్ధనిఘంటువులను, సంస్కృతవాఙ్మయమును బరిశీలింప రెండు పదములును గలవని స్పష్టముగ దెలియుచున్నది. సౌదామినియందలి మార్పు ఆంధ్రమునఁగలిగిన మార్పుగాదు. భాషాశాస్త్ర మర్యాదలచేనేమి, వ్యుత్పత్తి వెలుఁగనుండుటచేతనేమి, సౌదామినిపదము సంస్కృతమనసే స్థిరపడినది.

(1) అమరసింహుని నామలింగానుశాసనము దిగ్వర్గమున (8-9) తటిత్సౌదామనీ విద్యుచ్చంచలాచపలాపిచ అని కలదు.

దీనికి భానుజీదీక్షిత వ్యాఖ్యానమున (బొంబాయి 1907 సం) శ్వేతద్వీపః సుదామా-ఇతిత్రికాండశేషే. ఐరావతపర్యాయే-తేనైకదిక్ (4-3-112) ఇత్యణ్- అన్ (6-4-167)

ఇతిప్రకృతి భావా ట్టిలోపాల్లోపా న భవతః

సుదామ్నాద్రిణా-ఇతివా సుదామాతుపుమాన్ వారిధరపర్వత భేదయోః

సుదామ్నా మేఘే భవా వా-సౌదామినీ త్యపపాఠః । సౌదామన్య ప్సరో భే దే తడి త్త ద్భేదయోః స్త్రియామ్.

ఇందువలన సౌదామినియనునది యపపాఠమని వ్రాయఁబడి నది. దీక్షితులవారి వ్యాఖ్యానమునందే శతపత్రదాపదవ్యాఖ్యానమున శతహ్రదాస్త్రియాంవజ్రే సౌదామిన్యాం చకీర్తితా యను శ్లోకపాఠ ముదహరింపఁబడినది.

(2) అమరమునకు మాహేశ్వరవ్యాఖ్యానమున (బొంబాయి నిర్ణయసాగర ముద్రణాలయమున 1907 లో ముద్రితము)

సౌదామినీ విద్యుత్ చంచలాచపలాదశకం విద్యుల్లతాయాః- చపలాపిచేతిపాఠః (పుట 17)

(3) క్షీరస్వామి వ్యాఖ్యానమున (Oriental Book Agency 1941 Edited by Dr Har Dutt Sharma and Sardesai) అమరమూలము సౌదామినియనియే ముద్రితము - వ్యాఖ్యానమున సుదామ్నాద్రిణైకదిక్ సౌదామని తేనైకదిక్-ఇత్యణ్-(4-3-112) అని వ్రాయఁబడినది.

(4)తిరువనంతపురమున బ్రకటింపఁబడిన పంధ్యఘటీయ సర్వా నందుని యమరటీకాసర్వస్వమున సౌదామినీత్యపపాఠః । తథాచ హారి వ్రిలోప యమరకష.

ఖేంతంబగాము కాంచననరన మసౌదామనీలతా ధామాస్తమ్
కవలయు మిథనరజస్సరన మసౌదామనీలతా ధామాస్తమ్
అను శ్లోకము సాహ్మృతము.

(5) ఆనూరిసరస్వతీ తిరువేంకటాచార్యులవారిచే పరిష్కృత మగు గురుబాల ప్రబోధికయందు

'సౌదామినీ (మూలము)

వ్యాఖ్యా సుదామ్నా ఐరావతేన సహవర్తత ఇతి సౌదామినీ ఇచ్చట సౌదామనీ అనియు పాఠముగలదు.'

పైవానివలన నమరమూలమున సౌదామినియను పాఠముగూడ గలదనియు, గొందఱు వ్యాఖ్యాతలు దాని నపపాఠముగ గైకొని రనియు నిర్వివాదాంశము. ఇఁక మిగిలిన నిఘంటువులఁ బరిశీలింతము.

(6) వాచస్పత్యము - సౌదామనీ- విద్యుతి - అప్సరోభేదచ- ఐరావతరమోషితి - అనునర్థముల నిచ్చుచు

తత్రైపి అతోఽల్లోపే సౌదామ్నీత్యపి—శబ్దరత్నావళీ అని సౌదామ్నీ పదవ్యుత్పత్తిగూడ నిరూపించినది.

(7) శబ్దకల్పద్రుమమున—సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అను మూడుపదములును గలవు. అందు

సౌదామినీ-స్త్రీ-విద్యుత్-ఇత్యమరటీకా-
(౧-3-౬) యథాఋతుసంహారే (3-12)

వష్టం ధనుర్బలభిదోజలదోదరేషు
సౌదామినీస్ఫురతి నాద్యవియత్ప్రతాకా

తడిద్భేదః - యథామహాభారతే (3-58-12)
తత్రస్మరాజతేభైమీ సర్వాభరణభూషితా

సతడిద్వ్యౌ చిరరుచ్యాంగీ విద్యుత్ సౌదామినీ యథా
అప్సరోభేదః ఇతి హేమచంద్రః—దేశవిశేషః ఇత్యజయః
సౌదామ్నా—స్త్రీ సౌదామనీ ఇతి శబ్దరత్నావళీ

శబ్దకల్పద్రుమకారుని మతమున సౌదామిని పదముగలదనియు, దానికి కావ్యప్రయోగము లుదహరింపఁబడినవనియు స్పష్టము.

(8) కేశవకృత కల్పద్రుకోశః.

శమ్పా సౌదామనీ విద్యుచ్చంచలాచ శతహ్రదా
సౌదామినీ చ సౌదామ్నా హ్లాదినీచాశనిర్ద్వయోః
(బరోడాప్రతి పుట 396 శ్లో 154)

(9) మాహేశ్వరసూరి - విశ్వకోశః

సౌదామిన్య ప్సరోభేదే తటిత్త ద్భేదయోరపి
సౌదామినీ-స్త్రీ - సౌదామిని యను నప్సరస, మెఱుపు - మెఱుపులో భేదము.

(10) శహాజీ - శబ్దరత్నసమన్వయ కోశమున (బరోడా ప్రతి) నయిదుస్థలముల సౌదామినీ ప్రశంసగలదు.

సౌదామిన్యాంచ ఖద్యోతే గదితా - పు 48-17 పంక్తి.
విద్యుత్ సౌదామినీ సంధ్యాః 158-13
శతహ్రదాశ్యేంద్ర వజ్రీ సౌదామిన్యాంచ గద్యతే 179-12.
సౌదామిన్యాంస్త్రియాం విద్యుదప్సరోభేదయోరపి 207-19.
ఘనవల్లీ నిగదితా సౌదామిన్యాంవిశారదైః 312-9.

(11) ఇరుగపదండనాథుని నానార్థరత్నమాలయందు 1883 సంవత్సరమున మదరాసు వాణీవినోద ముద్రణాలయమున బ్రకటింపఁ బడిన గ్రంథమున సౌదామిన్య ప్సరస్యపి—సౌదామినీ అనిముద్రితము.

ఇటీవల వావిళ్లప్రతియందు సౌదామన్యప్సరస్యపి యనియే ముద్రితము.

(12) అజయపాలకృత నానార్థసంగ్రహమున (కలకత్తా సాహిత్యపరిషత్ప్రకటితము)

సౌదామినీ పురీభేదే చంచలాయాంప్రకీర్తితా శ్లో. 652.

(13) సంస్కృత శబ్దార్థ కల్పతరువు —

సౌదామినీ — ఈ కారాంతస్త్రీయాం – అమరః– విద్యుత్ - మెఱుపు – ఇకారయుక్త మకారమధ్యాపా

(14) సర్వశబ్ద సంబోధిని.

సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అనుమూడు పదములనిచ్చుచు సౌదామినీ పదమునకు దేశవిశేషమను నర్థమును గలదని తెలుపఁబడినది.

(15) Wilson's Sanskrit Dictionary.

సౌదామినీ – (F) Lightning (2) one of the apsaras or nymphs of Swarga (3) a particular sort of lightning (4) a city so named.

Kittel's Canarese Dictionary యందును సౌదామిని – a particular kind of lightning — Lightning (మించు – మంగరాజ నిఘంటు Mr 43) also సౌదామని.

(16) Apte నిఘంటువు నీమూఁడుపదములనిచ్చి యర్థముల నిచ్చుటలో

Lightning – సౌదామన్యా కనకనికషస్నిగ్ధయాదర యోర్వీ – మేఘసందేశ – 37

సౌదామినీవ జలదోదరసంధిలీనా – Mk 1-35 Mal Madh 8-14

అని మృచ్ఛకటికమునను మాలతీమాధవమునను సౌదామినీ పదము ప్రయోగింపబడినదని యుదాహృతము.

ఇంక కావ్య ప్రయోగములజూతము.

పరిష్కర్తల మార్పులచే గొన్ని ప్రతులయందు భేదములు గాన వచ్చుచున్నవి. శబ్దకల్పద్రుమమున సౌదామినీ పదమున కుదాహరణముగ ఋతుసంహార, మహాభారత ప్రయోగములు చూపఁబడినవి.

(1) ఋతుసంహారము — (3-12).

వావిళ్లవారి ప్రతియందును, మణిరాముని చంద్రికావ్యాఖ్యానమునందును (నిర్ణయ సాగరప్రతి) సౌదామిని యనియేకలదు. వియతి ఆకాశస్యపతాకా సౌదామినీ తడిన్నిస్ఫురతి నదీవ్యతి — మణిరామవ్యాఖ్య.

(2) మాలతీ మాధవము — (3-14)

ప్రియేణ బాంధవ సుహృత్ప్రియ సంగమాది సౌదామినీ స్ఫురణ చంచల మేవ సర్వమ్.

అప్టే దీని నిట్లె కైకొని యున్నాడు.

త్రిపురారి వ్యాఖ్యయందును 'సౌదామినీ స్ఫురణ వచ్చంచలమ్'

జగద్ధర వ్యాఖ్య – భవిష్య త్సౌదామినీ పార్శ్వ గమనస్యనూచనేన.

జీవానంద విద్యాసాగరునిచే కలకత్తాలో ముద్రింపఁబడిన 1876 సంవత్సర ప్రతియందును సౌదామినీ యనియే ముద్రితము – కాళేపండితుని సంస్కరణమున మూలమున సౌదామనియు, వ్యాఖ్యయందు సౌదామినియు గలదు.

(3) మృచ్ఛకటికము (V.G. Paranjpe's Edition 1937)

సౌదామినీవ జలదోదర సంధిలీనా. మృచ్ఛ – 1-35

నిర్ణయసాగర ప్రతియందు

సౌదామనీవ జలదోదర సంనిరుద్ధా యను పాఠాంతరము ముద్రితము.

(4) భర్తృహరి వైరాగ్యపద్ధతి – శ్లో॥ 36.

భోగా మేఘవితానమధ్య విలస త్సౌదామినీ చంచలాః

అని వావిళ్ల వారి ప్రతులయందును, 1928 సంవత్సరమున ముద్రితమగు నిర్ణయ సాగరప్రతియందును, డి. డి. కోశాంబి పండితునిచే భారతీయ విద్యాభవన ముద్రితగ్రంథము (1946) నందును సౌదామినియే గలదు. సౌదామనీ పాఠాంతరమని చూపఁబడినది.

రామచంద్ర బుధేంద్రవ్యాఖ్యానము కొన్నిప్రతుల సౌదామనియే గ్రహింపఁబడినది.

(5) కాళిదాసుని మేఘసందేశమున (శ్లో 37)

సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీయసాచో మల్లినాథునివ్యాఖ్యయందు సౌదామనియే మూలమని స్వీకరింపఁబడినది.

1941 (Paranjpe's edition) స్థిరదేవవ్యాఖ్య.

సౌదామిన్యా — స్నిగ్ధయా సౌదామిన్యా ఉర్వీంతర్శయ –

సౌదామిన్యా విద్యుతా

పరిషద్భాండాగారమునందలి (4676) సంఖ్యగల యొక ప్రాచీన ప్రతియందును 1947 సంవత్సరమున ముద్రింపఁబడిన నిర్ణయసాగర ప్రతియందును 'సౌదామిన్యా' అనియే ముద్రితము.

Nandarigikar's edition (1894) Verse 41-సౌదామిన్యా for సౌదామన్యా in Wilson's edition and Manuscripts $G, G_2$ $K, K_2$ R & M.

అని పాఠాంతరముగల ప్రతులు వివరింపబడినవి. దక్షిణావర్తనాథునిప్రదీప వ్యాఖ్యానమున సౌదామన్యా యనియేగలదు.

(6) శబ్దకల్పద్రుమమున నుదహరింపఁబడిన మహాభారత ప్రయోగమునకు (8-53-12)

నీలకంఠ వ్యాఖ్యయందు సౌదామని యని వ్యాఖ్యానింపఁబడుట మేఘాకాశ వృష్ట్యా మేఘ ... ధ్వనియనియర్థముకూడ వివరింపఁబడినది.

సౌదామనీ = ప్రావృషేణ్యామేఘ సంబంధినీ = సుష్ఠుజగతో జీవనం దదతి తేసుదామానో మేఘాః. తేషాం సమూహాః సౌదామనీః ప్రావృట్కాల తత్సంబంధినీ సాహి అత్యంతద్యోతమానో భవతీతి తత్త్వసిద్ధమ్ —

పైనవివరింపఁబడిన నిఘంటుకావ్యప్రయోగాదులవలన సౌదామిని పదమునుగూడ సంస్కృతనైఘంటికులు తమ తమ నిఘంటువుల జూపించిరనుట స్పష్టము. అర్థ వివరణమున 'దేశవిశేషము' పట్టణవిశేషమనియు విశేషార్థము నొసఁగిరి.

కాని వ్యుత్పత్త్యర్థమును విచారించుచో కేవలపాణినీయ సూత్రముల మాత్రమాధారముగ గైకొనుట యొప్పదు. పెక్కుపదములపాణినీయములయ్యు నితరవ్యాకరణముల సమర్థింపఁబడినవి. ముష్టాముష్టి అక్షౌహిణి మున్నగునవి. శాకటాయన వ్యాకరణమున 'ప్రజ్ఞా పర్ణోదక ఫేనాల్లేలౌ' యను సూత్రమున (386) సమర్థనమున పర్ణలః, పర్ణిలః— ఉదకలః, ఉదకిలః — ఫేనలః, ఫేనిలః = ప్రజ్ఞాలః, ప్రజ్ఞిలః మొదలగు రూపాంతరములు జూపఁబడినవి. మఱియు సికతిలః, శర్కరిలః అనునవి ఇలశ్చదేశే అనుసూత్రమున (392) సుదాహృతములు. పదములకు రూపాంతరములన్యవ్యాకరణసాహచర్యముచే గల్గినను గలుగవచ్చును. శబ్దశాస్త్ర పండితులిట్టివానిని భాషాశాస్త్ర మర్యాదలవలన (Philological Principles) గలిగినవని నిర్ధారణ మొనర్చుటయు గలదు.

అయినను సౌదామినీ శబ్దమును పాణిని సూత్రములవలన గూడ సాధింపవచ్చునేమో. సుదామా శబ్దమును వదలిన

సంజ్ఞాయాంసమాఖ్యామ్ అను పాణిని సూత్రమువలన (6-2-187) దామినీ, యామినీ, భామినీపదములు సాధువులే. దీనివలన సుదామినీ శబ్దమును సంబంధార్థమున సౌదామినియు నిష్పన్నమగుచున్నదనితో చుచున్నది. ఇందులకు విజ్ఞులగు పైయాకారణులే ప్రమాణము.

ఆ। సా॥ శా॥

# ఛందోదర్పణ సమీక్ష

(అనువృత్తము)

విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ కవి

ద్వితీయ పద్యమున కఖజ చఛడ దథభయశషసలు పద్యాది నుండరాదని యున్నది. ప్రథమ పద్యాన లోని యక్షరములు ద్వితీయ పద్యమునం బునరుక్తములుగా నున్నవి. అకచటతపయసలు వాయు బీజములు; ఖఛరసలగ్ని బీజములు; జడద (హ) లు భూబీజములు; థభలు జలబీజములు; శషలు గగనబీజములు.

మ॥ క్షితిబీజంబులు సంపదల్ పొదలంజేయించున్, బయోబీజముల్
సతతంబుం బ్రమదంబొనర్చు, శిఖిబీజంబుల్ మృతుంజేయు, మా
రుతబీజంబులు శోకవార్ధిం బడంగాం దోయు, న్నభోబీజముల్
పతి సత్యంతదరిద్రుం జేయు నెపుడుం బద్యాది నొందించినన్.

అను భీమనచ్ఛందః పద్యము నాధారముగాం గొని యరసినచో వాయ్వగ్ని గగనబీజములోలి శోకమృతి దారిద్ర్యఫలంబు లొసంగుం గాన నవి కావ్యాది నగ్రాహ్యంబులు. భూజలబీజ బులు సంపద్హర్షప్రదం బులు గాన జడద (హ-అనంతుని ఛందమున లేదు) థభలు పద్యాది బ్రయోక్తవ్యంబులేయగు. ద్వితీయ పద్యమున ననంతుండుకఖాద్యక్షర ములు పవర్ణాస్పదంబులు గాకుండిన మేలొదవించుననెను. ఉప వర్ణములన సమీపవర్ణములు. ఉపవర్ణాస్పదములనుట కర్థము సుజ్ఞేయ మే కాని యుందనంతుని యర్థమేమో దుర్జ్ఞేయమై యున్నది. సంయు క్తాక్షరము కాంగూడదనియా? స్వరములెల్ల నుత్సవకారులని కడవ టంగలదు. అట్టులే లాక్షణికుండు చెప్పలేదు. అధికములు లు వానిద్వీక్ష ములు క్రమముగా అనిలానల భూజల గగనబీజములగును. అట్లగు టచే మును చెప్పంబడిన చొప్పున భూజల బీజంబులగు ఉఊఋౠ లు మేలొదవించును. తక్కినవి శుభప్రదంబులుగావు.

ఈపక్షమునఁగాని వర్ణములకుఁ బ్రత్యేక ఫలములు చెప్పినవారి మతమనుసరించినను స్వరములెల్ల నుత్సవకారులు కాఁజాలవు. ఏతత్పక్షమవలంబించినను ననంతామాత్యుని కచటతపాది వర్ణపద్యాది ప్రయోగనిషేధము పొంది పొసఁగకున్నది. వీనినన్నిటిని జర్చించిన వ్యాసము పెరుగుటంజేసియు, నియ్యవి యద్యతనకాలంబున కనుపయుక్తంబులగుటం జేసియు, నట్టివాని నరయఁగోరువా రప్పకవీయాదులలో నరసి చూతురుగాక యని విన్నవించుచు విరమించుచున్నాను.

అక్షరముల శుభాశుభ నిర్ణయము తరువాత గణసంయోగ విషయముం దెల్పు పద్యములందును మతాంతరములు భాసిల్లుచున్నవి.

ఇంతదాఁకఁ గనఁబఱచిన వానియందు లాక్షణికుల పరస్పరమతభేదములు వ్యక్తములగుచున్నవి. పద్యలక్షణములందు నలంతిగణయతిభేదములు నక్కడక్కడఁ గలవు. ఇట్టులుంటకుఁ గారణములు ఛందోలేఖకుల ప్రమాదములును దాళపత్రలేఖన శైథిల్యాస్ఫుటతలు గావచ్చును. ఉత్తరోత్తర లాక్షణికులు తత్పూర్వపూర్వగ్రంథములందలి యిట్టి ప్రమాదములఁ బరిశీలించి యున్నవానిని సరిపుచ్చి గణయత్యాదుల నియమించుచు వచ్చిరి. వ్యాకరణము నిట్టిపట్ల కేలోనయినదని వేఱె చెప్పనక్కఱలేదు. ఆర్యాగీతుల లక్షణములం దనంతాప్పకవులకు భేదముగలదు, గాని యనంతుని లక్షణములు సంస్కృతవృత్తరత్నాకర లక్షణంబులకు సరిగా నున్నవిగాన నిందు విమర్శింపఁదలఁచుకోలేదు. వృత్తనామములం దనంతాప్పనలకే కాక తదితరులకు భిన్నత గలిమికిఁ గారణము పైని నావచించినదే యని యెఱుంగవలయు. వృత్తనామభిన్నతకుఁ గొన్ని యుదాహరణములు (అనం) మధుమతి-(అప్ప) మదనవిలసితము, (అనం) రుక్మవతి-(అప్ప) రుగ్మవతి, (అనం) మాణవ-(అప్ప) పణవ, (అనం) తోటక-(అప్ప) దోదక (అనం) తోదక-(అప్ప) తోటక, (అనం) గీతాలంబన-(అప్ప) [illegible]-కాంత (భిన్నత)

# అనంతుని రచనలోని ఛందోవిశేషములు.

అనంతుఁడు భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణ మను కృతిత్రయము వరుసగా విరచించిన విద్వత్కవి.

భోజరాజీయము ఛందోదర్పణమునఁ బేర్కొనబడి యుండుటచే నది తొలుత వ్రాయఁబడెనని విదితమయ్యెడి. "శ్రీనిధిచక్రవర్తి... అనంతధీమణి లసన్మణి భోజచరిత్ర చెప్పి లక్ష్మీనరసింహునిఁ గూర్చి ప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛందోనుతి" (ఛందోదర్పణ-4ఆ-180)

అనంతామాత్యుఁడు ఛందోదర్పణమున రచించిన లక్షణములు వానిక్రింది యుదాహరణములందే కాక తనగ్రంథములం దెల్లెడలఁ బ్రయోగించినాఁడు. ఉపాయ, ఉదార, ఉదాత్త, ఉదాహరణ, అనంత, అనేక, ప్రార్థ్య, జనార్దన, రసాయన, అంతరంగ, వృత్తాంత, రుద్రాత్మ, నిరంతర, నిరీక్షణ, సూచన, సంబోధనాంత శబ్దముల కుభయయతియు, భిన్నపోలికసరసబు ఋకారాదియతి భేదములు, కేచిత్ప్రాస భేదములు ననంతుని గ్రంథత్రయమునఁ గానవచ్చుచున్నవి. అంతియ కాక యతఁడు చెప్పని కొన్ని ఛందోవిశేషములు, నతని మతమునకు విరుద్ధములైనవియు నతని గ్రంథములం గానవచ్చెడి

(1) అర్ధబిందుప్రాస - పటలకు మాత్రమే సబిందుక నిర్బిందుక ప్రాసము చెల్లునని యనంతుని లక్షణము.

క. నూతుల దరులను లోఁతగు
పాతటి కసువులను నట్టిపచ్చిక యున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము
మాతినిడకు ముగ్రసత్త్వములు గలనీటన్ (భోజ-6-85)

మ. మిగులం జక్కనివాఁడు కాంచనరుచిన్ మిదించిన ట్లంగకాం
తిఁగడుం బొల్పగువాఁడు యౌవనమదోద్రేకమ్ము సంపద్దయున్.
(భోజ-8-285)

పైపద్యములం దనంతుఁడు చెప్పిన తకార గకారములకు సఖండాఖండబిందుప్రాస సంఘటితమై యున్నది. ప్రాఁతి పార్ధబిందుకముగా నిఘంటువులందుఁ గలదు. ఇది భ్రాంతిశబ్ద భవమనితోఁచెడు నిఘంటులందు దేశ్యముగానున్నది. లక్ష్మీనారాయణీయమునఁ దద్భవముగా రచితము. తద్భవదేశ్యములందిది యేదైనఁగానిండు, అరసున్న విషయమే మనకుఁ బ్రసక్తాంశము. ఇది సార్ధబిందుకమనుటకు నిర్ణాయక ప్రయోగము ప్రేక్ష్యము.

కాంతిఁ గడుంబొల్పుగవాఁడు; ఇందుఁ గాంతి కర్తగా నెంచినఁ గళయగును. గసడదవాదేశ సంధిజరిగి కాంతిగడుంబొల్పునని తేర్పడును. ఇందర్ధబిందువు గకారమునకు ముందుండ నక్కఱ లేదు. 6-ఆ-241 పద్యములో ...ఏటికి... పూఁట...మాట...చోటికి... అనుచో టకారము ప్రాసమందుఁ గలదుగాన ననంతునికి సమ్మతమేయగు.

క. కాఁగాని మాటలాడెడు
రాఁగూడదు నేఁడపశ్చరణమై నుఁడం
గాఁగోమలి యిటునిల్వక
తేఁగుము మగనాలికేల యీదుర్గుణముల్ (భో-4-148)

వేఁగు సార్ధబిందుకము గాకున్నచో ననంతుని యర్ధబిందుప్రాస లక్షణమునకు భంగముప్పతిల్లు ఈశబ్దము సఖండాఖండములుగాఁ బ్రయుక్తము "విని యతనిం దనపైనిడికొని యేఁగినియమికిఁ దగని ఘోరార్తి యొనర్చినవాఁడ" (రాఘవ పాండవీయము-1-ఆ-28 ప) ఇందు రామాయణార్థమున 'వేఁగి-నియమికి' అనియు, భారతపక్షమున 'ఏన్ + కినియమికి' అనియు భేదము.

క. ఆఁకొనివచ్చిన విప్రులఁ
దాఁకింపక యశనమిడుము తత్పరమతి న
ట్టాఁకలి నేయుకు కుడువం
దోఁకొని రావర్హ్యమగు తిథుల మనవారిన్. (భోజ-6-161)

క. కేతుపతాకలరంగ సీగతి
దోఁకొని చని చదల రత్నతోరణ దీప్తుల్
ప్రాఁకెడు ఘనగృహముల న
మ్మూఁకల విడియించె రాజముఖ్యుండంతన్ (భో-4-84)

ఉ. తోఁకొనిపోయెనంత నొకతొయ్యలి యయ్యెలనాఁగ నప్డు పే
రాఁకలి గొన్న బెబ్బులియయంబునఁ గృష్ణమృగార్భకంబుపై
(భో-8-226)

తోఁకొని నిరర్థబిందుక శబ్దము, అచ్చుప్రతియందు సార్థబిందుకముగా నున్నది. నిఘంటులందునున్నలేదు, శబ్దరత్నాకరకారులు తోఁకొనుశబ్దమును నిరర్థబిందుకముగా వ్రాసి 'సాధారణమున బుద్ధిజుఁ, డేకాంతము నరకమునకు నేగుచువానిన్, దోఁకొని' అనునన్నయ భారతారణ్య ప్రయోగమును జూపిరి. ఒక్కశబ్దమే కొందఱమతమున సఖండబిందుకము, వేఱుకొందఱమతమున నఖండబిందుకము. ప్రయోగ సాహిత్యమున వీనినిం దుదర్శింపఁగడంగిన వ్యాసము విస్తారమగు. అనంతునిమతమున నెట్లు, తోఁకొని' సఖండబిందుకములుగను 'బ్రాతి, యఖండబిందుకముగనుండునేమో? అట్లు భావింపకున్న పటలకుమాత్రమే యర్థబిందు ప్రాసయతి దేశించిన యనంతుఁడు తెకసి తానేతదితరములకు నెట్లు ప్రయోగించియుండును ?

(2) దధప్రాస-ఇది ప్రాసప్రకరణమున ననంతుఁడు వచింపలేదు.

క. మొదలను కఖజలు చఛడలు
దధలును భయశషసలుతగ (1-26-ఛందోదర్పణ)

క. అదురవస్థకు నోర్వక
యాదైవము మరణమేల యొసఁగవె యనుచున్
వేధించు నృపతియొద్దకు
నాదరమతి నారదుఁడు రయమ్మున వచ్చెన్ (భోజ-6-171)

వదలనుటయే క్రియమైనను ప్రాసఘటనార్థము 'వదలును' అని రచితమై యుండవచ్చును. వేధించు శబ్దమును వేదించుగా పూర్వకవులు వాడిన నిర్బంధము గలుగదు. బుద్ధి బాధా స్వాది శబ్దముల వర్గచతుర్థ వర్ణములు తద్భవమున వర్గతృతీయములుగా మారును. "వర్గంబుల ద్వితీయవర్ణ చతుర్థవర్ణములు తదాదివర్ణత భజించు" నని కవిసంశయ విచ్ఛేదము (3-వ రంగ-6 ప) లక్షణముచే వేధించు-వేదించు గానోపు.

(3) లళడలయతి ప్రాసఘటన యతిప్రాసమైత్రిల (ళ) డల కనంతుండు చెప్పలేదు.

క, ఋకారస్వరయతి యగునిట్లు
జేకదలక జలధిఁ బవ్వళించు నవఁగ (ఛందోదర్పణ)

చ॥ చెలఁగుచు రంగధామమును జెంది విభావరి వచ్చి వేకువన్
వెడలి ప్రయాగ కేఁగి సురనిమ్నగయందుఁ బ్రభాత కృత్యముల్
(భోజ-1-134)

పవ్వళించు ననుచోట 'పవ్వడించు'నని పఠించిన ళడయతి శంకరాఁజాలదని పరిషత్పత్రిక స్వభాను 3-4 సంచికలో 127 పుటలో వ్రాసితిని.

వెడలు, వెలఁడు శబ్దములు రూపాంతరములు॥ పైరెండవ పద్యమున వెడలు శబ్దమున్నచోట వెలడు రూపమును వ్రాసికొన్న బాధ తొలఁగును. నైషధమందు 'చిలుకలు గూయునో చెవులు చిల్లులువోవఁగ నంచు నెన్నడున్ వెళ్లఁడు' అను పద్యమును మద్దరాజు రామన లడప్రాసకు దాహరింపఁ గూచిమంచి తిమ్మకవి యది వెడలుగాదు వెలడని తెల్పి రామనమతమును ఖండించెను.

క॥ లడలకు నభేదమనుచున్
వెడగులు గడుఁ బ్రాసములును విశ్రమములు ను
బ్బడరఁగఁ గలుపుదు రది యె
ల్లెడలను భవ్యంబుగాదు హిమకరమకుటా.
(సర్వలక్షణ-2-22)

4. రళయుతి ప్రాసఘటన-'శరమతిరోలని' యొకట్టి యతి యందుఁ జేర్కొనుటచే ర ళ ల తనతనకే చెల్లును, పరస్వరము మిత్రములుగావని గోచరించెను. యతివిషయమున నింత మాత్రమేని చెల్పఁగాని ప్రాసవిషయమున వాని మిత్రతామిత్రతలంగూర్చి యొక సూచనయు లేదు. ఈక్రింది యనంతుని రచనలందు రళయుతి ప్రాసములమైత్రి గనఁబడుచున్నది.

ఉ॥ పాటుల పేరుచెప్పకొని బానెఁడుపప్పును బాయసంబునై
దాటుపసంట్ల వంటకము నాద్యముఁ గమ్మని కూరగాయలున్
జాటలుదించు వారసతిచొప్పున గొల్లనుమీటుకొంచు మా
తోరాడగొట్టు నీదగరతోఁ బడఁజాలము వేయుచెప్పినన్.
(భోజ-6-138)

ఉ॥ ఆఱుమొగంబులారఁడు మదాత్మజుఁడౌతని ముద్దుసేయుచో
నాఱుమొగంబులున్నలయ సంబిక! యేను నీవుఁగూడఁగా
నాఱుమొగంబులయ్యెడి రయంబునరమ్మని నీవు నవ్వుచున్
జేరుట యోగివర్యులకుఁ జిత్యహాగున్ ముఖపంచకోజ్జ్వలా.
పైరెంట రఱప్రాస. (భోజ-5-201)

ద్విరదగతిరగడ-
అంబరమున వ్రిద్ధ్యుగతివ్రిత్తి నఖముల రిపుసు
రంబు నరసింహుఁడనఁగ్రాలు సంయుక్తయతి
ఇందు రళయతి, (ఛందో-1-112)

చేరుశబ్దము లఘురేఫఘటితముగా సమాపించు అనునర్థమున గలదు "అప్రీతిఁల్ పల్కిన పాతకంబునకుఁజేరెన్ గాలమువేళ్లో"-నైనను శకటరేఫఘటితమైనచో సమాపించుట నర్థము లేదు. ఇందలి ప్రయోగ మనుసరించి దాని సాధుశకటరేఫఘటితముగా నన్నయాదులు వాడరాదు లఘురేఫాదియే. అట్లే ఆరవము లఘురేఫాది. ఇంత ఇట్టి ప్రయోగములన్ని గల శబ్దములవలె ఏని సాధుశకటరేఫ ఘటితములుగా గ్రహింప వీలు [illegible]ంతవచ్చు.

క॥ శృంగారభంగులైదు తె
అంగులు వాగ్విలసనంబు రహి నైశిథ్యంబు
(రఙావళి) (రసాభరణ-3ఆ-26పుట)

తెలుఁగుశబ్దమున శకటరేఫమే నిఘంటునఁగనఁబడుచున్నను, సర్వలక్షణసారసంగ్రహమునఁ గూచిమంచి తిమ్మకవి 'తెరలుకట్టుట రెండుతెరఁగులు తెగలగు' (3ఆ-10) అనుచోటను లక్షణసారసంగ్రహమునఁ జిత్రకవిపెద్దన 'తీరనికిన్కబల్ తెఱఁగుపనులు' (8ఆ 26) అనుచోటను రేఫఱకార నిర్ణయప్రకరణమందు లఘురేఫఘటితముగా నిచ్చియున్నారు. అప్పకవియు 'తెర తెరవచ్చుట తెరలుగట్టుట రెండు తెరఁగులవారలో దొరలుకొనుట'యని వ్రాసెను.

తాళ్లపాక తిరుమలయ్య రేఫఱకార నిర్ణయమునను నిది గల దని వైయాకరణపారిజాతము చెప్పుచున్నది. మఱల వైయాకరణ యాశబ్దమును శకటరేఫసంతముగాను చేర్చినారు.

తెలుఁగుతెప్పెఱ తొలుట తొలకటయును (సర్వ-3-61)
తెలుఁగుగల్గుట...... తెలుఁగొప్ప-(లక్షణ-3-28)
తెలవలు తెలకువ తెలుఁగువిధము-(అప్పకవీయము)

తాళ్లపాక తిరుమలయ్య మఱియీశబ్దమును శకటరేఫఘటితముగాఁ జేర్చినట్లు వైయాకరణ పారిజాతమునను న్నది ఇందాఁకఁదే లినదేమనఁ దెలుఁగుశబ్దముభయరేఫఘటితముగా నెన్నవచ్చుననుట. అనంతుని రసాభరణ ప్రయుక్త తెరఁగుశబ్దము లఘురేఫ మధ్యంబని భావింపవలసియున్నది.

చ॥ ఎఱుఁగకయుండిరొయింతెఁ జెలియేమియుఁ జెప్పకయుండ బిట్టుద
గ్గఱినఁ దలంకిచూచు నతికన్నులవిప్పును భ్రూవిలాసమున్
దరము మనోజ విభ్రమవిధంబును నింపొనరించు కాంచిదా
మఱియును నవ్విలాస మొగమాటుగనుంగొనఁ గోమవేడుకన్.
(రసా-2ఆ-12పుట)

క॥ మఱిసర్వరసోత్కృష్టత
నరయుచు బహుసంపదలకు నత్యాస్పదమై
మెఱసిన శృంగారరసము
తెఱఁగంతయు విస్తరింతుఁ దేటపడంగన్. (రసా-8-21పు)

క॥ వరుని దెస వేడ్కయుడుగుట
యరతి, నిజాచార మెడల నందినప్రీతు
త్రుటి లజ్జాత్యాగ మనా
స్మరపరితాపంబు పేరు సంజ్వర మయ్యెన్. (రసా-8-24పు)

ఇట్టి రేఫఱకార యతిప్రసక్తిఘటన యనంతుని గ్రంథత్రయమునఁ గానఁబడుచున్నది. ఎఱుఁగు, దగ్గఱు, మఱి, మెఱసిన, తఱి యిత్యాదిశబ్దములను లఘురేఫఘటితములుగాఁ బఠించుకొన్నచో సాధువులగును. అందుఁ గొన్నింటిని సాధింపవచ్చును. ఇట్టి పట్టులఁగల శబ్దములలోని రేఫములుభయవిధములగునని కాని, రేఫ ఱ కార సాంగత్య మనంతాభిప్రేతమని కాని యేదోయొకరీతిగా నంగీకరింపవలసి యున్నదని మాత్రము చెప్పవచ్చును.

5. అభేదయతి—పవలకుమాత్రము యతిమైత్రి చెప్పఁబడినది. అదియు నెబము నెవమువలె ద్వైరూప్యముగల శబ్దముగానుండవలసి యున్నది యని యింతకుముందు వ్రాసితిని.

క॥ మొగిలుంబ నలమగు నిటులన
సగణము సగణమగు నిట్లు నాహావగణముల్
భగణము లిట్లనఁ దండ్రి
భగణము పాల్గను భలంబు-వాకిలులనఁగన్. (ఛంద-1-22)

వై, వ్రాతఁ బదార్థసంఘములు-భ్రాతిగ నవ్వీభు పెండ్లియామినిన్
(భో-4-102)

వీక్ష్యదఁబోదగుట విభ్రమంబు భయమును వ్రీయమున్.
(రసాభరణ-2అ-10పు)

భగణము పాళ్లను పద్యమునకర్థము సంశయముగా నున్నదని ఛందోదర్పణమూలమున ముద్రితము. దీని సరియైన పాఠమెఱుంగు వఱకు 'భవ'ప్రాస సాంకర్యమున కిది నిర్ణాయక ప్రయోగము కాఁజాలదు. భోజరాజీయ ప్రయోగమునకు గత్యంతరకల్పన శక్యము గాదు. పాఠాంతర మేదేనియున్నదేమో పరిశీలింపవలయు. అందలి యతిస్థల స్థితభాతిశబ్దము తొక్కిపట్టి కాని సార్థకముగాదు. రసాభరణములోని పిడ్వడు శబ్దమునకు మూలరూపము 'పిడ్పడు' గావుటంజేసి యీపాఠమును గ్రహించిన నిర్బాధకమగును.

6. అఖండయతి - అనంతుఁడు నుడువని ప్రాదినిత్య నిత్య సమాసయతులకుఁజేరని యఖండయతులీ క్రింది పద్యములందుఁ గలవు.

శా॥ ఈశానుం బరమేశు ఫాలనయనున్ హేలాజితానంగు గా
రీశుం గేశవతల్పభూషణుఁ ద్రిలోకేశున్ వియత్కేశు న
త్త్రేశోదంచితు భుక్తిముక్తి ఫలదున్ గీర్వాణ నిర్వాహకున్
గాశీనాయకు విశ్వనాథుఁగొలిచెం గారుణ్య పుణ్యాకృతిన్.

(భోజ-6-213)

'అత్త + ఈశ + ఉదంచితు' -అథాత్తమింద్రియే- అనుకోశము ననుసరించి యత్తమన నింద్రియమనియు, అత్తేశుఁడన హృషీకేశుఁడనియు, అత్తేశోదంచితుఁడన విష్ణూపేతుండగు కాశీవిశ్వనాథుఁడనియు యర్థమగును. హృషీకేశశబ్దమువలె నత్తేశశబ్దము నఖండనిత్య సమాసముగాభావించి వ్యంజనయతిమైత్రి ననంతుఁడు పాటించియుండును. ఈక్రింది రసాభరణపద్యమున హృషీకేశశబ్దమునకు స్వరమైత్రి సంఘటితమైయున్నది.

“హృషీ, కేశుఁడురక్షించు రుక్మిణీశుఁడు మమ్మున్”

(రసా-3-ఆ-21వ)

క॥ ఆఁకొని యఱచెడిఁ జీవులు
నేఁకట వో నమలవలయు నీమాంసము (భోజ-4-211)

ఏఁకట ...... నీ(యొక్క)మాంసము—అని పదవిభాగము. వ్యాఘ్రము గోవుతోఁబల్కుమాటయిది, నీమాంసముకాని యీమాంసముగాదు.

చ॥ అనుచు నఖుండు పల్కుటయు నంకిలిఁజేసిన చిత్తవృత్తితో
గను తెలివందలంచి యధికంబుగఁగ్రమ్మఁడు బాప్పవారితో
నెనసిన తెప్పలెత్తుటయు నేర్పు సుఖానను జేన కన్నుల
ల్లన నఱచేతనత్తి వికలంబగు హారము చక్కఁద్రోయుచున్.

(భోజ-3-221)

జ్ఞానమునకు యోగ్యమగుట ననుభావంబై (రసా-2-9పు)

అగుటన్ + అనుభావము — సంధివశమున వచ్చిన నకారమునకు జ్ఞావడి కూర్పఁబడియున్నది.

అఖండవళ్లనంతునికి సమ్మతమే యనినయెడల నీక్రింది వాని నఖండవళ్లుగానే భావింపవచ్చు

ద్విరదగతి-నాకౌకసులనేలు-నముచి సూతనుపూజ
నతఁడుదాఁగైకొన్న-నందగోపాత్మజుఁడు.

ఇది యతిభంగముగా నింతకుమున్న పరిగణింపఁబడియున్నది (చూ-పరిషత్పత్రిక-స్వభాను ౫-౬-పు 165)

అధికశుభం బొదవును భయములును హానిబొందు—
నృసింహ (ఛందోదర్పణము)

పరిషత్పత్రికయందే 172 పుటలో (ముద్రణస్ఖాలిత్య శీర్షిక క్రింద నిది పేర్కొనఁబడినది. 'హానినొందు'నని మార్చిన యతిభంగము తొలంగునని వ్రాయఁబడియె. అనంతుఁడఖండవళ్లు వాడినాఁడని తోఁచుచున్నది. గానఁ బైపద్యమునందును నఖండవళియని తలంపనగు. అఖండవళ్లు భారతాదులందుఁగలవు. ఇప్పటి ముద్రితప్రతులలో నవి సంస్కరింపఁబడినవి.

మెచ్చునకుఁగొన్ని విద్యలమరినీకొడుకులట్టు లరయంగఁజనున్ (ఉద్యోగ)
నాయన మార దీనిఁగని-నవ్వెడు (సౌప్తిక)
చూచె మనంబునఁదలంచు-చుండుదు నేనున్ (ఆది)
ఘు, వ్వరుఁడగుచున్నవాని దివి-జారి (అరణ్య)

(7) త్రిస్రావ-ఛందోదర్పణమున సంఖ్యార్థక త్రికారములకు తకార ప్రాస మవంతుండు లక్షణముఁ జెప్పనుగదా. క్రింది పద్యమున నవంతుఁడే యుదాహరించియున్న (కవిసంచికలో) చూపఁబడిన భాస్కర రామాయణములోని దానివలె, తకార త్రకారములకుఁ బ్రాసమునూర్చి యున్నాఁడు.

క॥ ఆకర్కటి గర్భమున న
నేకంబులుపుట్టెఁబిల్ల లీనుచు మృతయై
పోకయిది యేమి కతమున
నీకు త్రిమ్మఱ బ్రతికియుండ నొగిఁగర్కటియున్.

(భోజ-6-178)

(8) వృద్ధియతి- ఈయతి యవంతుఁడు ఛందమునఁ జెప్పలేదు ఆనందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశి భాను... ...

(రసా-4 ఆ-41 పుట)

ఇందేకాక 'అర్ధఁజెందె ఘనోత్సవ త్సాతువనఁగ' అను ఛందోదర్పణ పద్యమునను గలదని కవిసంచికయందు వ్రాసియున్నాఁడ. వృద్ధి సంధిలోఁబరపదాద్యచ్చులకేని, యాదేశములైన ఇచ్చులకేని యతి మైత్రిచెల్లునని వృద్ధియతిలక్షణము కాకునూర్యకృపకవి వచించెను. పై యవంతుని పాదద్వయమున నాదేశైచ్చులకే యతిసంఘటితమై యున్నది.

(9) సంధిగతప్రాసము-

పొందెఖుంగవేకదా నీ

కుంటెరుపునవివిదు తోడి కొండీలు సుమీ (రసా-4-86 వ)
బిందుప్రాసమున ధకారమునకు, సంధిగతప్రాసమున వకారమునకు మాత్రమే లక్షణలక్ష్యములు ఛందోదర్పణమున రచితములు. ఈప్రాస మప్పకవీయాదుల మతమున సంధిగతప్రాసమేయగు. ఛందోదర్పణము తరువాత రసాభరణ మనంతుఁడురచించుటచేఁ దానులక్షణమున నప్పు డుచెప్పకున్నను బ్రయోగపరిశీలనమున నీప్రాసముగూర్చియుండును.

(10) సంయుక్తయతి-

"ఒక్కెడుగున విశ్రాంతులు
వెక్కగుచో సంయుతములు పేనుకమునుద
డ్డక్కరములఁ దానిత్తిన
యక్కరమే యనుపవలయు నన్నిటఁ గృష్ణా"

అని యనంతకవియే లక్షణము రచించి యీక్రింది పద్యమునఁ బ్రమాదమునఁ గాఁబోలుఁ దన్నియమభంగము పచరించినాఁడు.

మంగళ మహాశ్రీ-దీనికి 9-17 యతిస్థానములు.

చిత్తములఁజూపులను - జిత్తజుని తండ్రివయిఁ
-జెంది గజదంతి యాతులొందన్,
నృత్తముల తోడఁదరు-ణీమణులు గానరుచు
-లింపుగను మంగళ మహాశ్రీ.

ఇందు ద్వితీయచరణమున 'నృ' అనుదానికి 'ణీ' యను హల్మైత్రి యు, 17-వ చోట నట్టి హల్మైత్రియుంచక నకారములోని ఋత్వ మునకు మాత్రమే యతిమైత్రియు సంఘటింపఁబడియె. ఇది సంయు తయతి భంగము. ఇట్టివి పెక్కు మహాకవుల గ్రంథములందుఁగలవు అవి ప్రమాద పతితములు గానోపును. మచ్చునకుఁగొన్ని:-

కాంచ॥ క్రౌంచ పదీ వృత్తమ్మనఁ జెన్నారఁగఁ బలుకుదురిలఁ గవి
వరులెల్లన్ (అప్పకవీయము)
మహాస్రగ్ధర॥ క్షితి గూలంగోటి సంఖ్యల్-గెడయఁగరివరా-శీతిసాహస్ర
సంఖ్యల్ (ఉత్త-హరివంశ-6-185
స్రగ్ధర॥ బాలవృద్ధా-ర్తస్త్రీ క్షేమంబుగానం-దఱుఁబొలిసిన వె-న్కన్
జయంబేలనాకున్ (భాస్కర రామా-యుద్ధ)
స్రగ్ధర॥ తొమ్మాత్మ స్వామిధామ-శ్రమణ కృశవపు-ర్నప్రవిశ్రాణి శాతి
కళాపూర్ణ-7-177)

పైప్రయోగంబులందెల్ల సంయుక్తములోని యొక హల్లునకొకచో, మఱొకహల్లునకు మఱొకచో యతిసంఘటితము.

అఖండయతి క్రిందఁజూపిన 'నాకౌకసులనేలు-నముచి నూతను పూజ-నలఁడు దాగైకొన్న' యనుదగడలో నాకశబ్ద ముభయయతి ఘటనాయోగ్యముగానఁ దొలుతహల్లునకు. తరువాత నచ్చునకు యతి మైత్రి పాటింపఁ బడెననియు నూహింపనగుచున్నది.

ఎఱ్ఱన నృసింహపురాణములోని యీక్రింది మందాక్రాంతను బరికింపుఁడు- (4ఆ-188ప)

వేలాక్రాంత - త్రిభువనమహా - ద్వీద్వీపమల్లక్ష్మసూక్ష్మ
క్ష్మాలావిర్వ-స్ఫురితరచనా-దుర్నిరూపాత్మకేలో
ద్వేలాకార-క్షుభితవలయో-త్కూల కల్లోల మాలో
ల్లోలాబ్ధింద్రో-ల్లుఠితవసుధా-లోకరక్షా సమక్షా

ఆంధ్ర లాక్షణికులు మందాక్రాంతకుఁ బదవ యక్షరముపై నొక్కయతియే చెప్పిరి గాని సంస్కృతలక్షణమున మూఁడుచోట్ల యతులు నియతంబులై యున్నవి.

"మందాక్రాంతా జలధి షడగై ర్మ్భౌ నతౌ తో గురూ చేత్"
(చూ. వృత్తరత్నాకరము)

జలధి-4, షట్-6, అగ-7, తొలినుండి 4 పై, అటనుండి 6పై, అటనుండి 7 పై విరతులు. తొలుతనుండి వరుసగా లెక్కించిన 4, 10, 17 అక్షరములపై విరతులని యేర్పడును. పైన్నృసింహపురాణ పద్య పాద మొక్కటెత్తుకొని వివరించెద.

లోలాబ్ధిందో[4]ల్లు - లిత వసుధా[10] - లోకరక్షా సమక్షా[17]

సంస్కృతమునందు విశ్రాంతిగాన మూడవ (17) యతిస్థానముతోడ పాదము ముగిసిపోవుననియు దరువాతిపాదములోం దెలుంగులో వలెం గలుపరాదనియు నర్థము చేసికోవలె. అట్టిచో మన తెనుంగు వర్ణమైత్రి సాంప్రదాయముచొప్పున, 10 పై యతులుండనను న్నృసింహపురాణ పద్యములో నీయతి నియమము పాటింపబడినది. ఏతత్పద్యోత్తరార్ధమున సంయుక్తములోని యొక్క వ్యంజనమే రెండుచోట్ల యతిస్థానమునంగలదు. పూర్వార్ధమునట్టిభంగము ప్రమాదమునంబడియుండునని యూహింపనయ్యెడు. మొదటిచరణమున 11-వ యక్షరము 'ద్వి' వకారమునకుందొల్తను, దకారమునకు నడుమను యతి సంఘటితము. అట్లే ద్వితీయపాదమున 'స్థా' లోని సకారమునకు 4 పై, థకారమునకు 10 పై యతిమైత్రిగలదు. ఎట్లు సంస్కృతలక్షణమే పాటించినాడని తెలియుచున్నది. నన్నయ పృథ్వికి 11 తర్వాత పడిపాటించె. ఆంధ్ర లాక్షణికులు నన్నయనుసరించిరి. ఎట్లైన సంస్కృతలక్షణము తెలుగున 8 తర్వాత యతి యుంచియున్నాడు.

"రమా కుచ పరిస్రష్టి-యా-ప్రణత దాననిత్యోదయా"

(నృసింహ-3 ఆశ్వాసాంతము)

(11) విద్యున్మాల-

పంక్తి (10) ఛ్ఛందమునుండి యతి యుండునని సర్వలాక్షణికుల మతమైయున్నది. అట్లుండియు విద్యున్మాల (8-ఛందమునంబుట్టిన వృత్తము)కు యతి 4-పై సర్వలాక్షణికులుంచి యున్నారు అనంతామాత్యుడు నట్లేవ్రాసె

(అనంత) మాద్యద్భక్తిన్ — మాగాయత్తిన్
విద్యున్మాలా-వృత్తంబొప్పన్
హైద్యధ్వంసిన్-సంబోధింపన్
సద్యశ్శ్రీయో-జాసంబయ్యెన్

(భీమన) ఉద్యన్మాగా-యుక్తంబైనన్, విద్యున్మాలా-వృత్తంబయ్యెన్.
(విన్న-పెద్దన)

శ్రీ లీలన్ రా-జిల్లున్ విద్యు, న్మాలాఖ్యంబై-మాగాసక్తిన్.

(చిత్ర-పెద్దన) మాగావిద్యు-న్మాలారీతుల్
(అప్పకవి) శ్రీ దేవధా-త్రీపాగ్రేశా
యాదిత్యజ్యో-త్స్నాదిస్తుత్యా
వేదోద్ధర్తా-విద్యున్మాలం
బాదై మాగా-ప్తిం బొల్చున్.
(రంగకవి) దేవా మాగా-ప్తిన్ విద్యున్మా
లావృత్తంబా-రంగాధీశా.

సీతారామాంజనేయసంవాదమందలి విద్యున్మాలకును యతి గలదు. వృత్తరత్నాకరమున 'మో మో గో గో విద్యున్మాలా' యనులక్షణమున యతి చెప్పఁబడలేదు గాని యీక్రింది శ్రుతబోధ లక్షణము మన యాంధ్ర లాక్షణికుల యతిఘటనకుఁగొంత మూలమన వచ్చునని తోఁచెడు.

శ్లో॥ సర్వే వర్ణా దీర్ఘా యస్యాం, విశ్రామస్స్యాద్వేదైర్వేదైః,
విద్వద్బృందైర్వీణావాణీ, వ్యాఖ్యాతా సావిద్యున్మాలా॥

ఇట్లు తెలిపిన కొలఁది యింక నన్నిమో విషయములున్నవైనను విస్తరణ మింతటితోఁ జాలించెద.

# గ్రంథస్వీకారము.

1. కఠోపనిషద్భాష్యమ్- శ్రీ రంగరామానుజముని విరచితము. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారిచే శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య గ్రంథమాలయందు ప్రకటితము. వెల రు 3-12-0

శ్రీ దేవస్థానము వారిదివరలో ఈశావాస్య, కేనోపనిషత్తులను రంగరామానుజభాష్యముతోడను, ఆంగ్లవివరణ భాషాంతరీకరణములతోడను ప్రకటించియున్నారు. ఇప్పుడు కఠోపనిషత్తునుగూడ నారీతిని పీఠిక, మూలగ్రంథము, రంగరామానుజభాష్యము, ఆంగ్లానువాదములతో ప్రకటించిరి. ఇయ్యది యాంగ్లభాషాకోవిదుల కతియుపయుక్తమై విశిష్టాద్వైతభాష్యమునందలి ముఖ్యవిషయములనెఱుగ నుపకారియగుచున్నది. పీఠికయందు దెలిపినటుల శంకరాదుల భాష్యముల కాంగ్లానువాదవివరణములు గలవు. అటులనే విశిష్టాద్వైతభాష్యముల కనువాదవివరణముల రచించునుద్దేశముతో నీగ్రంథము ప్రకటింపఁబడినది. ఆంగ్లభాషావేదుల కిది మిక్కిలి యుపయోగకరము. మిగిలిన యుపనిషద్భాష్యములనుగూడ నిట్లే యచిరకాలమున ప్రకటించి దేవస్థానము వారును ప్రాచ్యగ్రంథ ప్రకాశకులును, పండిత వర్గమును కృతకృత్యులగుదురుగాక.

2. అన్నమాచార్యచరిత్రము-తాళ్లపాక చినతిరువేంగడనాథ ప్రణీతము. విమర్శకాగ్రేసరులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విపులమగు పీఠికతో ప్రకటితము. అన్నమాచార్యుల మనుమడే యీ ద్విపద గ్రంథము రచించియుండుటచే నిది వారి జీవితవిషయముల తెలియుటకు మిక్కిలి యుపయోగకరము. వీనితో సత్యగ్రంథముల గల విషయములఁజేర్చి శ్రీ శాస్త్రిగారు తమ సహజపాండిత్యముతో [illegible]

మాచార్యునిచరిత్రమున గల ముఖ్యవిషయముల పీఠికయందు జర్చించిరి. అన్నమాచార్యుని సంకీర్తనములు తదితర గ్రంథములనుగూర్చియు పలువిషయములుమనకు దెలిపియున్నారు. శ్రీ అన్నమాచార్యులు పెక్కు సంకీర్తనముల రచించియుండుటయేగాక ద్విపదరామాయణము సంస్కృతమున వేంకటాచలమాహాత్మ్యము, పండ్రెండు శతకములను రచించెనట. అందు శ్రీ వేంకటేశ్వరశతకముమాత్రము లభ్యమైనది. సంకీర్తనములు కొన్ని గ్రంథరూపమున బ్రకటితములు (ప్రాచ్య గ్రంథమాల 11 కుసుమము) ఈగ్రంథమును రచించిన చినతిరువేంగడనాథుఁడను చిన్నన్నయు పెక్కు ద్విపదగ్రంథముల రచించి ప్రౌఢశక్తి నవాఁడు. అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసము, ఉషాపరిణయమనునవి యీతని యితరకృతులు. కావ్యరచనచే శ్రీ వేంకటేశుని మెప్పించి మకరకుండలముల గొంటినని తనగ్రంథములఁ దెలిపికొనియున్నాఁడు. చిన్నన్న ద్విపద కెరుగునను నదీతని గూర్చియే. తాళ్లపాకవారి రచనముల పెక్కింటిని బ్రకటించి యాంధ్రలోకమునకు శ్రీ తిరుపతి దేవస్థానమువారొనరించిన సేవ యతిప్రశంసనీయము. అందును శ్రీ ప్రభాకరశాస్త్రిగారిచే నవి బ్రకటితములగుట బంగారునకు తావియబ్బుటయే. లభ్యములగు మిగిలిన గ్రంథములను సైత మచిరకాలమున బ్రకటింతురుగాక. వెల రు 2-8-0 దేవస్థానము ఆఫీసున దొరకును.

3. విశ్వరహస్యము } ఈ గ్రంథములు రెండును విజయనగర మహారాజావారి కళాశాలలో పదార్థ విజ్ఞానాధ్యాపకులగు
4. చంద్రునికథ }

శ్రీ వసంతరావు వేంకటరావుగారిచే రచింపఁబడిన గేయములు. విశ్వరహస్యమునందు పెక్కు వైజ్ఞానికవిషయములు సులభగ్రాహ్యములగునట్లు గేయరూపమున వివరింపఁబడినవి. ప్రపంచోత్పత్తి, మూలపదార్థములు, శక్తులు, వానిమార్పు, జీవోత్పత్తి, వాని పరిణా

మము మొదలగువవెన్నియోగలవు. చంద్రునికథయందుగ్రహముల పరిభ్రమణము, చంద్రమండలము భూమినుండి వేఱగుట, అంతరి వాతావరణము, పర్వతస్వరూపము వర్ణితములు. గ్రంథకర్తలు వైజ్ఞానికవిషయములను వర్ణింపుచు నచటనచట మానవప్రవర్తనము విధ్యుక్తధర్మములనుగూర్చి ముచ్చటించి, మనశక్తి సామర్థ్యములపై నాధారపడి దేశాభివృద్ధికై పాటుపడవలయునని పాఠకులను హెచ్చరింపుచున్నారు. అతిప్రయాసముపైన తెలిసికొనదగు వైజ్ఞానికవిషయము లు సులభరీతిని గేయరూపముగ దెలిపి నూతనమార్గమును ద్రొక్కిన గ్రంథకర్తల నభినందింపవలసియున్నది. వెల మొదటి గ్రంథము రు 1-0-0 రెండవది 0-8-0. వలయువారు విజయనగరమున గ్రంథ కర్తలకు వ్రాయవగును.

5. A Descriptive Catalogue of the Telugu Manuscrip's Vol X1 — Medicine

ఇది గవర్నమెంటు ప్రాచ్యలిఖితభాండాగారాధ్యక్షులచే వైద్య గ్రంథములను గూర్చి ప్రకటింపబడిన గ్రంథపట్టిక. ఈగ్రంథమున 82 వైద్యగ్రంథములు సంగ్రహముగ వివరింపబడినవి: అష్టాంగ హృదయము, వైద్యచింతామణి, బసవరాజీయము మొదలగు సుప్రసిద్ధ గ్రంథము ప్రతులేగాక ఔషధయోగములు, కాయచికిత్సలు, వైద్యసారము మొదలగు గ్రంథములు గలవు. దీనియందుగల విషయములను ఆయుర్వేదశాస్త్ర వేత్తలు సమ్యగ్విమర్శనమొనర్చి ప్రకటింప వలసినవానిని బ్రకటించినచో, దేశీయ వైద్యపద్ధతులకు తగు సహాయకారియగును. వివరణ పట్టికయందు హయలక్షణవిలాసము, అశ్వశాస్త్రము, సహదేవపశుశాస్త్రమున్నగు గ్రంథములును గలవు. గవర్నమెంటు ముద్రణాలయము మదరాసు వెల రు 6-8-0.

